# దీనమందారశతకము.

ఇది

రేపల్లెపురవాసియగు

చింతలపాటి దక్షిణామూర్తిశాస్త్రిచే

విరచితము.

కృష్ణాస్వదేశి ముద్రాక్షరశాలయందు

ముద్రింపంబడియె.

మచిలీపట్టణము

1918

వెల 0—1—6 Price 0—1—6

# విజ్ఞప్తి.

ఆర్యులారా!

కేవల భక్తి రసపూరితములైన యిట్టి శతకములయందు భావ వైచిత్ర్యములు గాని, యర్థ గాంభీర్యములు గాని, యితరాలంకారములుగాని యుండవనుట యెల్లరకును విశదమే. అదియునుంగాక కథా సందర్భ రాహిత్యముంబట్టియు, కేవల భక్తియే ముఖ్యోద్దేశముగా నుండుటంబట్టియుఁ బునరుక్తులును విశేషముగ నుండును. అట్టియెడ బాల్యమునందు రచింపఁబడిన యీ చిన్ని పొత్తంబున దోషంబు లుండకమానవు. కావున గుణగ్రహణపారీణులైన ప్రాజ్ఞు లిందలి గుణములను మాత్రమే గ్రహింతురుగాక.

దీని రచించుటయందు మదగ్రజులును, సరసకవితా ధురంధరులును నైన చిం. వేంకటశివశాస్త్రిగారు నాకు మిగులఁ దోడ్పడిరి.

ఇట్లు, బుధజనవిధేయుఁడు,

చిం. దక్షిణామూర్తి.



# తప్పొప్పులపట్టిక

| పుట | పఙ్క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 8 | పారయణా | పరాయణా |
| ,, | 9 | పోమక | సోమక |
| 5 | 20 | మాయ మోహితులై | మాయా మోహితులై |
| 8 | 1 | సామర్ధ్య | సామర్థ్య |
| ,, | 24 | ఉత్సాహంబొవ్వగ | ఉత్సాహంబొప్పగ |
| 13 | 7 | లావెది | లావేది |
| ,, | 15 | బంథించి | బంధించి |
| 14 | 2 | భూంతస్కులై | భూంత చేతస్కులై |
| 16 | 7 | థాత్రీ | ధాత్రీ |
| ,, | 19 | సౌఖ్యంబులం | సౌఖ్యంబులన్ |
| ,, | 22 | జహ్వా | జిహ్వా |

శ్రీరామచంద్రాయనమః



# దీనమందారశతకము



శ్రీరామామణిఁ గాంచి యుండియు నహో ♦ [illegible] నిద్రాణునందున్నదై
[illegible] లేయుండెను సృష్టికయ్యెను జగ ♦ త్సంబంధశూన్యాత్మవై
నాక [illegible] చేసి [illegible] గసియుక్ ♦ సద్బుద్ధిచారిత్రమౌ
ప్ప [illegible] చెదర గృ ♦ ష్ణా! దీనమందారమా.

మ. భువనంబుల్ సృజియించు [illegible] ♦ పోషించు విష్ణుండవై
శివరూపంబున నాశకారకుఁడవై ♦ చెల్వొందు దత్త్వాంత సం
స్థానమయంబగు నిస్స్వరూపమునయౌ ♦ శక్త్యాది లోకేశ! కే
శవ దామోదర! వాసవానుజ! కృ ♦ ష్ణా! దీనమందారమా. 2

మ. యతిలోపంబులొ ప్రాసలోపములొ యే ♦ యూహింపను మ్యెన్నఁ పుం
బహుభక్తిస్ఫురితంబులై ఘన సమం ♦ దానందము గూర్చు నీ
కితలం బ్రాహగ నెంచి తోఁచినగతిన్ ♦ గల్పించి సద్వర్ణనల్
శతకంబున్ రచియింపఁ బూనితిని కృ ♦ ష్ణా! దీనమందారమా. 3

శా. బాల్యక్రీడలు కౌసలంబసులమే ♦ పంబోలు యవ్వేళ నే
లీలం జేరెదమంచు నాసలకు రా ♦ లేకంగదా పంచ బం
గాళంబై శరణన్నఁ గాచితి వహో ♦ ఘంబైన యుష్మత్కథా
జాలం బెన్నఁదరంబె మూర్ఖులకుఁ గృ ♦ ష్ణా! దీనమందారమా. 4

శా. అంధపాత్రియుఁడు దున్నసేనుఁడతి గ ♦ ర్వావిష్టుఁడై క్రూర ని
ర్బంధం బొప్పగ ద్రౌపదీవసన సం ♦ భారంబు విప్పన్ విప
ద్బంధూ! ప్రాణపరాయణా! యనిమదిన్ ♦ భావించినన్ రక్షణా
శంబ్ధైర్యంబున వేడఁ గాచితివి కృ ♦ ష్ణా! దీనమందారమా. 5

మ. కరిణీ సంఘముతోడఁ దద్విభుడు దాఁ ♦ గాంతార తీరంబునన్
సరసిం జేరగఁ బోయి వేజలపిపా ♦ సాయత్త చిత్తంబునన్
గరమున్నించి పిఱుంద హజ్జనిడి హా! ♦ గ్రాహంబు కాల్వట్టెనో
హరియన్నన్ గరుణించి కాచితివి కృ ♦ ష్ణా! దీనమందారమా. 6

మ. తొలుతన్ సోమకనామ దైత్యుఁడు మహా ♦ దోర్గర్వమేపారఁ బ్రాఁ
బలుకుల్ ముచ్చిలి బ్రహ్మనిద్రిలనకూ ♦ పారమ్మునన్ డాగినన్
లలిమీనాకృతి వానిఁజంపి వెసనా ♦ మ్నాయంబులం దెచ్చితో
నలినాక్షా నిను నెన్నగాఁదరమె కృ ♦ ష్ణా! దీనమందారమా. 7

మ. సురసంఘంబులు దైత్యులుంగలిసి యీ ♦ సుంజెంది యంభోనిధిం
దరువంజొచ్చినవేళ మందరగిరిన్ ♦ దర్పంబునం గ్రుంకకుం
డరహిం గూర్మమవై వహించిన నినున్ ♦ వర్ణింపగా శక్యమే
సరసీ సంభవ సంభవాదినుత కృ ♦ ష్ణా! దీనమందారమా. 8

మ. ధరణీమండల మొక్కపెట్టున సము ♦ ద్రంబందుఁ గల్పన్ని శా
చర నాథుండు హిరణ్యనేత్రుఁడు దురా ♦ చారుండు యత్నించుచోఁ
గిరివై పీచమడంచి వానిజయల ♦ క్ష్మింగొన్న నీనామమే
హరినారాయణయంచుఁ బాడెదను కృ ♦ ష్ణా! దీనమందారమా.9

మ. ధరణీ నాథులనెల్లనోర్చి పృథుదో ♦ ర్దండ ప్రతాపంబునన్
సురలన్ భూసురులన్ మునీంద్రవితతిన్ స్రుక్కించి ధర్మంబు పెం
పఱఁగాఁ జేసినదైత్యు నుక్కడఁచి ప్ర ♦ హ్లాదున్ భవద్భక్తునిన్
నరసింహాకృతిఁ గాచినావుగద కృ ♦ ష్ణా! దీనమందారమా. 10

శా. శక్రుండాదిగఁ గల్గు నిర్జరుల దో • స్సారంబుమైగెల్చి ని
ర్వక్రత్వంబున మూఁడు లోకములనున్ • వైరోచనుండేలఁగాఁ
జక్రీ నీశరణంబు వేడితిమి ర • క్షిం జల్ప వేయన్న నా
శక్రుంగాచితి వామనుండవయి కృ • ష్ణా! దీనమందారమా. 11

మ. ధరణిన్ రావణ కుంభకర్ణులు మహా • దర్పోన్నతుల్ బ్రహ్మచే
వరముల్ గాంచి యజయ్యులై జనములన్ • బాధించుచున్ లోకపా
లుర శాసించుచునుండ నీవు కరుణా • లోలుండవై జానకీ
శ్వరరూపంబున వారిఁజంపవొకో కృ • ష్ణా! దీనమందారమా.12

మ. ఇలపై సజ్జన దుర్జనావళుల నీ • వేకాదె తేజస్వివై
కలికాలాంతము నన్మ్రదంబొదవ ర • క్షాశిక్షలంజల్పుచుం
గలికాకారముచేత నొప్పెదవు నీ • కారుణ్యమే కోరున
న్నలతింజూడకుమయ్య మ్రొక్కెదనుగృ • ష్ణా! దీనమంవారమా.13

మ. అవనిదేవులఁ బుణ్యమూర్తుల మహా • హంకార హుంకారులై
యవమానించిన క్షత్రియాధముల శౌ • ర్యస్ఫూర్తి ఖండించి యీ
భువనంబందున ధర్మరక్షణ కళా • పూర్ణుండవై జామద
గ్న్యవతారంబునఁ బొల్చినావుగద కృ • ష్ణా! దీనమందారమా. 14

శా. శాంతాకారుఁడవై నిరంజనుఁడవై • సర్వేంద్రియ వ్యాపృతి
భ్రాంతిన్ గీటునఁబుచ్చి యెంతయు మనో • వైకల్యముల్ మాని ని
శ్చింతన్ బుద్ధుఁడవై తపంబుసలుపన్ • జెల్వొందు నీ రూపమున్
స్వాంతంబందున నిల్పి కొల్చెదను గృ • ష్ణా దీనమందారమా. 15

మ. జలజాక్షుల్ జలకంబులాడు నెడనే • 'సందేహముం జెంద కా
నలువల్ ముచ్చిలి పొన్న చెట్టుపయి డా • పంజూచి లజ్జాభరం
బెలయన్ వారలు 'కోకలియ్యగదరా! • యేపాటి మర్యాదరా!
చలమేలా' యనినిన్ను వేడరొకో కృ • ష్ణా! దీనమందారమా. 16

శా. వెన్నన్ దొంగిలె వీఁడు మా గృహములన్ ♦ వేమాఱు నింటింటఁ గన్
సన్నల్ సేసెను మా కుమారికలకున్ ♦ దండింపు మీ బాలునిన్
మన్నింపం జనదంచుఁ దల్లికిని లే ♦ మల్ దెల్ప నన్నిట్లసం
జన్నే మీకని వాదులాడెదవు కృ ♦ ష్ణా దీనమందారమా. 17

శా. శ్రీరమ్యంబగు కౌస్తుభంబు నడుమన్ ♦ జెల్వొంద నానారుచి
స్ఫారంబై త్వదధీన గోపవనితా ♦ చక్రస్తనాలిప్తక
స్తూరీ చందన సౌరభాకలిత వ ♦ క్షోభాగమందాడు నీ
హారంబే సుకృతంబుఁ జేసినదొ! కృ ♦ ష్ణా! దీనమందారమా. 18

మ. మగువల్ బ్రేముడి నాటపాటలకునై ♦ మన్నించి నిన్ బిల్వఁగా
సొగసుం జూపుల నర్మగర్భిత వచ ♦ శ్శోభా విశేషంబులన్
దిగియుం జూతువనంగకేళికపురా ♦ నిక్రీడలే నట్టు లె
న్నగ నేర్తున్ ననుఁగావ వేఁడెదను కృ ♦ ష్ణా! దీనమందారమా. 19

మ. నిసువా నిన్ను వధింపనెంచి కపట ♦ స్నేహంబునం జన్గవన్
విసముం జేర్చికొంచుఁ బాలుగుడుపన్ ♦ నీ యొద్దకున్ వచ్చు ర
క్కసినిం బూతన నుక్కడంచి యమలో ♦ కప్రాప్తిఁ గల్గింపవే
యసమానమ్ములు నీ చరిత్రములు కృ ♦ ష్ణా దీనమందారమా. 20

మ. చతురాస్యుండు భవన్మహా మహిమము ♦ స్సాధ్యంబటంచించుకే
మతి నూహింపఁగ లేక వెల్లయిన త ♦ న్మాయాగతిన్ గోపికా
సుతులన్ వత్సములన్ హరించి చనగాఁ ♦ జోద్యంబుగా నీవు అ
న్నతను ప్రాప్తిఁ జరించినావుగద కృ ♦ ష్ణా దీనమందారమా. 21

మ. చిగురుం గేలను వెన్నముద్దయిడి "నా ♦ చిన్నారి కుఱ్ఱండ! నా
సొగసుం బెన్నిధి! వెన్న మ్రుచ్చిలితివం ♦ చున్ ఏమనింవింతు రే
తగునే యింకటఁ బోవవ"ల్లని యశో ♦ దాదేవి ప్రార్థింపఁగా
నగుచుం బోవనటంచుఁ బల్కెదవు కృ ♦ ష్ణా దీనమందారమా. 22

శా. "రాఁడే కృష్ణుఁడు రాఁడె?" యనుచు నా ♦ రాజీవపత్రేక్షణల్
ప్రీతిన్ "మానము ప్రాణ"ముంచుఁ "బరిత్యాగింపం జెందకే యేడను
వచ్చెడో రాఁడుగదా" యటంచు మదిలో ♦ నంగుంది వేమారు నీ
జాడల్ చూచుచు సంచరించెదరు కృ ♦ ష్ణా దీనమందారమా. 23

శా. సౌందర్యంబు ఘటించుచున్ నెమిలిపిం ♦ ఛంబుత్తమాంగంబుపై
నందూలాడుచు వింతవర్ణముల నీ ♦ వన్ గోపికా బాలలన్
సందుల్ గొందులు దప్పనీక ముదముతో ♦ సయ్యాటలంజల్పుచా
నందాంభోనిధి నోలలాడెదవు కృ ♦ ష్ణా దీనమందారమా. 24

మ. కొడుకుల్ బెండ్లము తన్ను వేఁడికొనఁ సం ♦ కోచింపకే భక్తిమై
యడుకుల్ కొంగున మూటగట్టుకొని శా ♦ ల్యన్నా భావంబు పెం
పడరన్ నీకునుఁ గానుకిచ్చిన కుచే ♦ లాఖ్యుండు ధన్యుండు గాం
చఁడె నిత్యంబు నపారసంపదలు కృ ♦ ష్ణా దీనమందారమా. 25

మ. ధనధాన్యాదులఁ గోరలేదనఁడు నీ ♦ దాక్షిణ్యమే చాలు నీ
తనువుల్ సంపదలుం దిరంబులగునే ♦ తత్కాల సంతోషకా
రణముల్ గాక; సతంబు గోరుదుఁ బవి ♦ త్రింపా భవన్నామ సం
జనితామోఘ సుధారసంబొకటె కృ ♦ ష్ణా! దీనమందారమా.26

శా. కాయక్లేశముచే నసత్యములచేఁ ♦ గాలవ్యయం బెప్పుడున్
జేయుంబూని యధర్మరీతిని ధన ♦ స్వీకారముం జేయుచున్
నీయందించుక భక్తిలేక కడు దు ♦ ర్నీతిన్ విజృంభించుచున్
మాయామోహితులై జనుల్ చెడరె? కృ ♦ ష్ణా దీనమందారమా.27

మ. దిశలం గీర్తి వెలుంగ ధర్మసుతుఁడ ♦ ధ్వరిన్ నిర్వహింపన్ నిరం
కుశమై యొప్పెడు రాజసూయమున నీ ♦ కున్ వైరియై తిట్టఁగా
శిశుపాలున్ భవదీయచక్రనిహతిన్ ♦ ఛేదించితే యో దేవ! స
ద్యశముం గైకొనినావు లోకమునఁ గృ ♦ ష్ణా దీనమందారమా.28

మ. వెలదుల్ నీపయిమోపు నేరములకున్ ♦ వేసారి నీతల్లి గ
ట్టలుకన్ నిన్నొక ఱోలఁగట్టునెడ నీ ♦ వాఱోటినిం దానికిం
గలయంగట్టిన మద్దిచెట్టుల వెసం ♦ గాలీడ్చుచున్ లాగ సం
చలితంబొంది తరుల్ మహింబడవె కృ ♦ ష్ణా దీనమందారమా. 29

మ. పరగన్ జన్మము లెన్ని జేసినను నీ ♦ పై భక్తి లేకున్నచో
నరుడెవ్వండును ధన్యుఁడౌనె పరమా ♦ నందస్థితిన్వొల్గునీ
పరతత్త్వం బెఱుగంగ సాధ్యమగునే ♦ భావింప బ్రహ్మాది ని
ర్జరులైనం గననేఱరాపదవిఁ గృ ♦ ష్ణా! దీనమందారమా. 30

మ. భయదుండై సతతంబు నొక్కకొలన ♦ న్వర్తించుచున్ క్రోధిత
స్మయుఁడై యందిన జీవులంగఱచుచున్ ♦ శాపస్థితిం బొల్చుకా
ళియు నిందొక్కి శిరంబుపై నిలిచి కే ♦ ళీ చాతురిం జూపి వి
స్మయమొందించితి వెల్లలోకములఁ గృ ♦ ష్ణా! దీనమందారమా. 31

మ. పలకేలం దనతల్లి కొంగుచెఱఁగున్ ♦ వాటంబుగాఁ బట్టి డా
పలి చేనద్దముఁబూని యందునిజ రూ ♦ పంబున్విలోకించి గ
ట్టలుకన్ "రెండవకృష్ణుఁ దెచ్చితివె అ ♦ మ్మా"యంచుఁ గోపించి భూ
స్థలిపై నద్దముఁ బాఱవేసెదవు కృ ♦ ష్ణా దీనమందారమా. 32

శా. పాలంద్రావుచు నీదుతల్లికిని నీ ♦ పద్మాల్గు లోకమ్ములున్
హేలావిస్ఫురణన్ గనంబఱచి య ♦ య్యింతిన్మహా విస్మయా
లోలన్మానసఁ జేసినావపుర! యా ♦ లోచింప యుష్మత్కథా
జాలంబెన్న నెవండుశక్తుఁడగుఁ గృ ♦ ష్ణా దీనమందారమా. 33

మ. అమరేంద్రుండొక కుక్కుటాకృతిని మో ♦ హాంధత్వమేపార గౌ
తము వంచించి యహల్యఁగూడఁగ దురం ♦ తంబైన యమ్మౌని శా
పముచేఁ దానొకఱాయియై పడిన య ♦ ప్పద్మాక్షి యుష్మత్పదా
బ్జములందాఁకి పవిత్రయయ్యెఁగద కృ ♦ ష్ణా! దీనమందారమా. 34

మ. దురితంబుల్ మితిమీఱఁ జేసినను నీ ♦ దుర్జ్ఞేయ తత్త్వంబు నే
నరుదేనిస్మది నించుకేనరసి స ♦ న్మార్గంబునం బోవ సు
స్థిర దావానల దగ్ధకాననము రీ ♦ తిన్ సర్వకారోరు సం
సరణ క్లేశములెల్ల నాశమగుఁ గృ ♦ ష్ణా! దీనమందారమా. 35

మ. మును దేవాసురులబ్ధిఁ ద్రచ్చి యమృతం ♦ బుం గ్రోలఁగా నెంచ మో
హినివై, వంచనఁ బొందిరక్కసులు ని ♦ న్వీక్షింపఁగా సింహికా
తనయుస్వాతనయుక్ శశాంకరవిద ♦ త్తంబైన సంజ్ఞాగతిం
జనగాఁ జేసితి వయ్యమస్థలికిఁ గృ ♦ ష్ణా! దీనమందారమా. 36

మ. మనుజుల్గొందఱు భక్తిహీనులయి దు ♦ ర్మానోద్ధతింబూని పె
ల్చనగోపీ విటరాయఁడంచును సురా ♦ చారుండటంచుంగడున్
నిను నిందింతురు; బుద్ధిహీనత మెయిన్ ♦ నీ బ్రహ్మచారిత్వ మె
న్ననశక్తుల్ గద దుష్టమానవులు కృ ♦ ష్ణా! దీనమందారమా. 37

శా. లీలామానుష విగ్రహుండవయి దో ♦ ర్లీలాసముల్లాసముం
బోలంజూపుచ నేక రాక్షసవధం ♦ బుం జేయుచున్ భక్తులే
వేళన్ని పదధూళి ముక్తిగనఁగా ♦ పెంపెక్కినావోర! వా
చాలుంట్రాకము నీకథామృతము కృ ♦ ష్ణా దీనమందారమా. 38

మ. ఫలముల్గొన్ని యఁమర్చి పెల్లగుచు నీ ♦ పై భక్తి విశ్వాసముల్
వెలయం దారుచి చూచుచున్ శబరియ ♦ ర్పింపంగ సద్దాని యెం
గిలిఁ దిన్నట్టి మహానుభావుఁడవు ర ♦ క్షింపంగదే నన్ను నం
జలిఁగావింతును దేవకీతనయ! కృ ♦ ష్ణా! దీనమందారమా. 39

మ. చెఱుపుల్నూతులు గోతులున్నదులు వీ ♦ క్షింపంగ భిన్నాకృతిన్
వఱలుంగాని జలప్రపూరితములై ♦ నన్ వానిలోనున్న నీ
రరయంగా నొకటే కదా! తనుతరం ♦ బై నీ స్వరూపంబు నా
సరణిన్వర్తిలునెల్ల దేహములఁ గృ ♦ ష్ణా! దీనమందారమా. 40

శా. దేవుండెచ్చట లేఁడు లేఁడనుచు, మా ♦ దే సర్వసామర్థ్యమం
చీ విశ్వంబున దైవసంగతి యొకిం ♦ తేనిం గనన్ రాదటం
చావిర్భూత మదాంధులై రవికర ♦ వ్యాప్తస్థలీ క్షిప్తమా
శైవాలంబుఁ గియర్ జనుల్ సెడరె కృ♦ ష్ణా దీనమందారమా. 41

శా. పాలన్ముంచెదొ సీటముంచెదవొ నీ ♦ పాదంబులే నమ్మి న
న్నేలన్ సందియమంద నేల కరుణ ♦ న్వీక్షించి రక్షింపు గో
పీలావణ్య వచస్సుధానుభవ సం ♦ ప్రీతుండవో నీవు మూ
ర్ఖాలాపంబులు లెక్క సేయుదునె! కృ ♦ ష్ణా దీనమందారమా. 42

మ. వెఱిపోకిఁంతయు లేక నాదసుమనో ♦ భృంగంబు యుష్మత్పదాం
బుసహోమంద మరంద సుందర రుచీ ♦ పూగోచితంబై నిరం
తర సంజాత వినూత నాఖిల మహా ♦ నందాంబుధిం దేలి తా
నరుగంజూచునె యొండు చోటికిసేఁ గృ ♦ ష్ణా దీనమందారమా. 43

మ. తపముల్ దానములున్ వ్రతక్రతువులుం ♦ దక్షంబు యుష్మన్మహా
కృపగల్గన్ ఫలియించి కర్తలకుఁ గ ♦ ల్గించున్నదా సౌఖ్యముల్
విపులార్థంబుల నంత వైభవములున్ ♦ వేయేల! దేవా యను
ర్త్యపతిస్సుఖంగ వచ్చు నీకృపను కృ ♦ ష్ణా! దీనమందారమా. 44

మ. కుధరం బొక్కటి బూజసేసిరని తాఁ ♦ గోపించి గోత్రారి వా
రిధరంబుల్వీడించి యొక్క మొగివ ♦ ర్షింపం బయింబంపినన్
శిథిలత్వంబునుఁ జెందు గొల్లలను ర ♦ క్షింపంగ గోవర్ధనా
ఖ్య ధరిత్రీ ధరమెత్తినావుగద కృ ♦ ష్ణా! దీనమందారమా. 45

శా. సాహంకారులు నీదుపాద జలజ ♦ ధ్యానానుభావంబుఁ దా
మూహింపంగ నశక్తులౌదురకటా! ♦ యుచ్చైఃపదం బేరికిన్
మోహావేశము దక్కకే విధముగాఁ ♦ బొందంగనౌ? సంతతో
త్సాహంబొప్పఁగ నిన్నె నమ్మవలెఁ గృ♦ ష్ణా దీనమందారమా. 46

మ. అనయంబున్ భవదీయ కీర్తనముచే • నత్యంతమున్ జిహ్వ పా
వనమౌఁగాదె! భవత్కథల్వినఁచోఁ • బ్రాపించు నీ శ్రోత్రముల్
గనఁగాఁజాలు ఫలంబదెల్లఁ గమలా • గంజాక్ష! యో పక్షివా
హన! నన్నేలుము నిన్నుఁ గొల్చెదను కృ • ష్ణా! దీనమందారమా. 47

మ. అతుకన్వచ్చును ఛిన్నశైలములు; సా • హార్దంబునన్ వంజులన్
బ్రతుకన్వచ్చును; గొప్ప సంద్రములలోఁ • బెల్లిదగావచ్చుఁ దాఁ
బ్రతుకన్వచ్చును దుర్గమాటవుల దు • ర్వారాగ్ని నీభక్తి సం
తతి పంపింపఁగ లేము నిక్కముగఁ గృ • ష్ణా! దీనమందారమా. 48

మ. అనుమానించి కథయుంబాసంగతి నటుం • చామోద మొప్పన్నునుం
గనుమా నీదుకటాక్ష వీక్షణములం • గావంగ; నావేడికోల్
వినుమా దీనులఁ గాచువాఁడవను నీ • బీరంబు నేఁడెల్ల నా
రనుమానింతురు నేటిబిజయని కృ • ష్ణా! దీనమందారమా. 49

మ. సతతాచార నిషిద్ధ కార్యరతులై • సాంగత్య దోషాభివ
ర్ధిత కామాద్యరి వర్గయుక్తులయి యు • క్తిన్ సంతతాశాప్రపీ
డితులై దుర్జనసంఘ సంజనిత గో • ష్ఠీతుష్టులౌ వారలు
న్నతి నీపాదరజంబుఁ గైకొనరు కృ • ష్ణా దీనమందారమా. 50

మ. భగవద్ధ్యానము నల్పనేరరుగదా • పాపాత్ములెల్లుండ నీ
పగచే భక్తుల గేలిసేయుదురనీ! • వారంత్యకాలమ్ము నం
దగఁ గీనాశునిబంట్లు రజ్జువులచే • తం బట్టి బంధింపఁగా
నగఁగాఁ జూతురొ! పూర్వరీతిగను కృ • ష్ణా దీనమందారమా. 51

శా॥ కావింపన్వలె నీకుఁ జెందు మఖముల్ • కౌతూహలం బందుచున్
భావింపన్వలె నెమ్మనంబున భవ • న్నామంబు నశ్రాంతమున్
సేవింపన్వలె నీపదాంబురుహముల్ • శ్రేయోభిలాషుల్ రమే
శా! వరిఘ్ణ మహోదయాజలధి! కృ • ష్ణా దీనమందారమా. 52

శా. వీసంబైన భవత్పదాంబుజ రజం ♦ బేచాలుఁ నెంతెంతలా
దోసంబుల్ హరియింప; నొక్కపరి శాం ♦ తుండై భవన్నామ జి
జ్ఞాసం జల్పినఁ గల్గుభక్తున కభీ ♦ ష్ట ప్రాప్తి నీయందె నా
యాసల్ నిల్పితి నన్నుఁ గావగదె కృ ♦ ష్ణా! దీనమందారమా. 53

మ. అరిషడ్వర్గము గెల్చి పిమ్మట నరుం ♦ డష్టాండుగానోపు దు
స్తర వేదాంత విచార భూరితర కాం ♦ తార ప్రచారాప్తి కి
ద్ధరణిన్ వాఁగెడు లోభులెల్లఁ బరమా ♦ త్మ స్వరూపంబుఁ దా
మరయన్నేర్తురె యెన్నిభంగులను కృ ♦ ష్ణా! దీనమందారమా. 54

మ. శివుడున్ నీవును నొక్కరూపయనుచుం ♦ జింతింపఁగా లేక మా
నవు లొక్కుమ్మడిఁ బోరుచుంద్రు తమలో ♦ నన్ లోభులై 'నీవె పె
ద్దవు' 'కాదాతఁడె పెద్దయం'చు నకటా! ♦ దర్శింపరో వేద వా
క్య విచారజ్ఞు లభేదతత్త్వమునుఁ గృ ♦ ష్ణా! దీనమందారమా. 55

శా. కట్టంజూతురు కొందఱీజగతిలోఁ ♦ గాషాయ వస్త్రంబులన్
మెట్టంజూతురు దొమ్మరిండ్లకట! యా ♦ మిథ్యా విచారజ్ఞులం
బెట్టంజూతురు కొందఱుత్తములస ♦ త్ప్రీతంబులన్ భక్తిమై
అట్టుల్ సేయఁగబోదు నామనసు కృ ♦ ష్ణా దీనమందారమా. 56

మ. గెలువంగావలె నింద్రియంబులను; భ ♦ క్తిన్ నీ పదాంభోజముల్
గొలువంగావలె; జ్ఞానమొందవలె; యీ ♦ ఘోరంపుసంసారమున్
దొలఁచంగావలెఁ దా విరాగి యగుచుం ♦ దోడ్తోన బ్రహ్మాంబు ని
శ్చలపూర్ణామానసమందుఁ గాంచనగుఁ గృ ♦ ష్ణాదీనమందారమా. 57

శా. మాంసోపేతము, శల్యసంకులము, దు ♦ ర్మాలిన్య మూలంబునై
ధ్వంసంబయ్యెడు నీశరీరముపయిన్ ♦ భ్రాంతిన్ వృథా సేయుచుం
గంసధ్వంసక! నీదు సేవకయి యం ♦ గంబుల్నియోగించుచున్
సంసారంబుఁ ద్యజింపగా వలెను కృ ♦ ష్ణా దీనమందారమా. 58

మ. వనితాపుత్ర సుహృజ్జనంబులకు నై ♦ వాంఛించి దుష్కర్మముల్
వొనరం జేయుట నేమి? వార లెవరో! ♦ పూర్వంబు తా నెవ్వడో
ఘనమాయా లసదంధకారమునఁ ద ♦ త్కర్మప్రచారంబులం
దనువుల్ దాల్చినభిన్న వర్తనులు కృ ♦ ష్ణా! దీనమందారమా.59

మ. మొదల జ్ఞానముచేతఁ గొన్ని దినము ♦ లోర్వంగ; నాపైనఁ గొ
న్ని దినంబుల్ సను గర్వభావ మెదలో ♦ నిండంగ; నాపిమ్మటన్
మదనావేశతఁ బోవుఁ గొన్ని దినముల్; ♦ మర్త్యుల్ రుజావిద్ధు లం
త్యదశన్; నిన్ను స్మరించు టెన్నఁడిఁకఁ గృ ♦ ష్ణా దీనమందారమా.60

శా. బింకాల్ చూపినలాభ మేమి? కుజనుల్ ♦ పెల్లైనగర్వంబునన్
అంకెల్ వేసిన లాభ మేమి? మనసా ♦ రన్ నీదు పాదోల్ల స
త్పంకేజంబులఁ గొల్వలేక నరక ♦ ప్రాప్తిన్ గడుంగుందుచోఁ
జంకెల్ గొట్టుదురో ముదంబునను గృ ♦ ష్ణా! దీనమందారమా.61

శా. జారత్వంబున నెగ్గులేదనుచు నీ ♦ చప్రక్రియా లోలురై
సూరాగ్రేసర వేషమూని కుమతుల్ ♦ చూపట్టుచుందొంద ఱ
వ్వారిన్ లోకులు నమ్మఁగూడదు సుమీ! ♦ భక్తుల్ లసన్మార్గ సం
చారుల్ మాత్ర మెముక్తిఁ గాంచుదురు కృ ♦ ష్ణా! దీనమందారమా.62

మ. తడయంజూడక సత్ప్రవర్తనమునన్ ♦ ధన్యాత్ములై నిన్ను న
మ్మెడు సద్భక్తులలోపలం జెడెడు వా ♦ రే లేరు నిన్ నమ్మకే
చెడువారుందు రనేకులన్న పలుకుల్ ♦ చింతింపఁగా లేరుగా!
జడు లన్నన్ మతి యెవ్వ రిద్ధరణిఁ గృ ♦ ష్ణా! దీనమందారమా.63

మ. తలపన్ సర్వజనాళికిన్ సులభసా ♦ ధ్యంబైన మార్గంబు ని
మ్ములఁ దాఁగాంచక యాదిశంకరులె త ♦ ప్పుల్ సెప్పినారన్న మూ
ఢుల వేదాంతులటంచుఁ జెప్పనగునే! ♦ గో మాయులం దెచ్చి యు
జ్జ్వల సింహమ్ములటంచుఁ జెప్పగలఁ గృ ♦ ష్ణా దీనమందారమా.64

మ. మదినానందము చెంగలింప విలస ♦ న్మల్లీ మరందంబు ష
ట్పదముల్ గ్రోలవె? గ్రోలిసంతత సుఖ ♦ ప్రాప్తిన్ విజృంభించి య
భ్యుదయం బందవె? నీపదస్మరణ పీ ♦ యూషంబుఁ గ్రోలంగ సౌ
ఖ్యదమై యుండునటన్న నబ్బురమె! కృ ♦ ష్ణా దీనమందారమా. 65

మ. వికలుండై కృతకర్మసంచయ ఫలా ♦ విర్భూతిచేఁ బుత్రమి
త్ర కళత్రానుజవర్గ సంకలిత బం ♦ ధ వ్రాతముల్ ద్రెంపఁజా
లక సంసార మహాబ్ధి మగ్నుఁడయి లో ♦ లత్వంబునన్ నిన్ను నె
న్నక జీవుండతిలోభియై చెడును కృ ♦ ష్ణా! దీనమందారమా. 66

మ. నినువర్ణించెద; నీకతల్ సదివెద ♦ న్నీకంటె నన్యంబు మె
చ్చను; నీనామము నేస్మరించెదను నీ ♦ చంచత్కృపా పాంగ లో
చన కాంతుల్ విలసిల్ల నన్నుగని నం ♦ జాలున్ మహాసౌఖ్య సం
జననంబౌఁగద నీదయామహిమ కృ ♦ ష్ణా దీనమందారమా. 67

శా. పాలందేలెడు మఱ్ఱియాకు కొనయే ♦ పాన్పౌచు నిద్రించు నీ
లీలామానుష విగ్రహంబుఁ గనఁగాఁ ♦ లేరెంత యోగీంద్రులుం
గేళింజల్పుచు గొల్లచేడియలతోఁ ♦ గ్రీడించుటల్ సూడ నా
నాళీకాక్షుల భాగ్యమెంతటిదో! కృ ♦ ష్ణా దీనమందారమా. 68

మ. కలవారెల్లెడ లేరు; కల్గినను గాం ♦ క్షుంజేసి దానమ్ములన్
జలుపంబూనెడు వారు లేరకట! యీ ♦ సంపత్తులా ధర్మరా
శ్ణలము ప్రాప్తులవెంట వచ్చుననియో ♦ నిత్యంబులం చెంతయుం
దలపంజూతురు మూర్ఖమానవులు కృ ♦ ష్ణా దీనమందారమా. 69

మ. దిశలుంగాలము నగ్నిమారుత ధరి ♦ త్రీ సాగరంబుల్ గిరుల్
పశుపక్ష్యాది సమస్త భూతములు నో ♦ పద్మాక్ష! నీరూపముల్
వశమే మూర్ఖుల కారహస్యమును సం ♦ భావించి వర్తింపఁగా
శశచిహ్నాంచిత మౌళివంద్యపద! కృ ♦ ష్ణా! దీనమందారమా. 70

మ. మహిలోఁగొందఱు నాస్తికాధములు న♦ మ్మంజూడరయ్యాదురా
గ్రహులై నిన్ను దిసంతుకొట్టెదరు మూ♦ ర్ఖ ప్రక్రియన్ వారు నీ
మహనీయోజ్జ్వల పాదరేణుకణ స♦ మ్మానంబునంగాక దు
స్సహపాపంబులఁ బాయనోపుదురె కృ♦ ష్ణా! దీనమందారమా. 71

మ. ఎవరో కొందఱు నిన్నుఁ దిట్టిరని నా♦ కేలా విచారంబు నీ
కవునే లోపము దానిమూలమున? నా♦ వ్యర్థప్రజల్ కష్ట కా
లవశత్వమ్మున నట్లు సేసి తుదకున్♦ లావేది నీచస్థితిం
దవులన్నిశరణంబు వేడెదరొ కృ♦ ష్ణా దీనమందారమా. 72

శా. వచ్చుం గష్టదశల్; గణింపకమె య♦ వ్వానిన్ భవన్నామమే
యిచ్చున్మెచ్చుచుఁ గష్ట సౌఖ్యములకీ♦ వేయంటి నో దేవ! యీ
వచ్చున్ నాకభయంబు నిప్పుడయినం♦ బద్ధాత్మునన్ గావఁగా
నచ్చేలా నినునచ్చినాఁడఁగద కృ♦ ష్ణా దీనమందారమా. 73

మ. మనసన్ వానరమొక్కచోట నిలువం♦ బ్రాల్మాలు; దుష్కర్మ కా
రణమై వక్రగతిం జరించు; సురభి♦ ప్రాయంబులంబన్ను; స
న్మునివర్యుల్ దృఢభక్తి రజ్జుల మన♦ మ్ముంబట్టి బంధించి స
త్యనిరూఢిన్ నినుఁగొల్చుచుండెదరు కృ♦ ష్ణా! దీనమందారమా. 74

మ. అనఘాయొక్కటి నిన్ను వేడెదను నా♦ యందున్ దయంజూపియీ
మనవిం జేకొనుమయ్య! నామనసు యు♦ ష్మత్పాద సేవారతిం
దనివిం జెందవలెన్; వరంబొసఁగు మీ♦ తథ్యంబుగా నట్లయా
నని; నాకేమి కొఱంత గల్గునికఁ గృ♦ ష్ణా! దీనమందారమా. 75

మ. మదినిన్నే స్మరియించువారికి జగ♦ న్మాన్యా! ధరిత్రిన్మహా
పదలున్ వచ్చును; వచ్చినం గలుగు లో♦ పం బున్నదే వారిక
య్యది సౌఖ్యాప్తికె కారణంబగును దే♦ వా అంతమాత్రమ్మునన్
వదలంగూడదు నీదుపాదములు కృ♦ ష్ణా! దీనమందారమా. 76

శా. మాయామోహములు న్విర్జితేంద్రియులు స♦న్మార్గ ప్రచారుల్ మహా
ధీయుక్తుల్ నినుఁ గాంచుచుందురు కృతా♦ర్థీభూత చిత్తులై
నీయందింతక భక్తి నిల్పుటొకటే♦ నేనేర్చితిఁ దీరితిగా
నాయజ్ఞానము సైపుమో వరద! కృ♦ష్ణా దీనమందారమా. 77

మ. ధనముం గూర్పఁగ నేల? మానవుల క♦ద్దానన్ ఫలంబున్నదే?
తనువుల్ నిత్యములౌనె? బుద్బుదము లం♦తం బౌద, వేవేల్మిడిన్
గన నారీతి వినశ్వరంబులు గదా♦ కాయంబులో నందనం
దన! కూర్పన్వలె నీకృపాధనముఁ గృ♦ష్ణా! దీనమందారమా! 78

శా. నెమ్మోవిం దగ వేణువూని యడుగుల్ ♦ గీలించి కన్దోయిఁ దో
రమ్మై యొక్కట నోరచూపుల రుచుల్ ♦ రాజిల్లఁగా హారి గీ
తమ్ముల్ పాడెడువేళ ఱాల్గరగవో! ♦ తారాడుచున్నట్టి వ
త్సమ్ముల్ సేరవొ! నీ సమీపమునఁ గృ♦ష్ణా! దీనమందారమా. 79

శా. నీసద్భక్తుని నంబరీషుని మహా♦నిష్ఠాగరిష్ఠాత్ము దు
ర్వాస ప్రేషితమైన శక్తి యురుదం♦ష్ట్రిల్ రాజిలన్ ఘోరమై
గాసింబెట్టఁగ వానిఁ గాచితివి చ♦క్రంబున్ని యోగించి శ్రీ
శా! సామర్థ్యమనంగ నీయదియె కృ♦ష్ణా! దీనమందారమా. 80

శా. అక్షీణంబగు నీ మహామహిమ నే♦నా మెన్నువాడన్ భవ
త్కుక్షిన్వర్తిలు నెల్లలోకములు; నీ♦కున్ దాసుడ నన్నుఁగన్
రక్షింపం జనుఁగాక నీకుఁ దగునే♦ ప్రాల్మాలఁగా నో సరో
జాక్షా! నమ్మితి నీపదంబులనుఁ గృ♦ష్ణా దీనమందారమా. 81

మ. ఘనచైద్యక్షితినాథరక్షిత లస♦త్కంజాక్షి నారుక్మిణీ
వనితారత్నము దొంగిలించిన మహా♦ప్రౌఢుండవౌ నీవు నా
మనసున్ దొంగిలినాడవన్న నది సా♦మాన్యంబె యౌరా నద్దియుం
జనఁగా లేదు ముకుంద! నిన్విడిచి కృ♦ష్ణా దీనమందారమా. 82

మ. జప హోమంబులునుం దపంబు సలుపన్ ♦ సామర్థ్యమా లేదు నా
కెప్పుడు న్నీ పదపద్మముల్ గొలుచుటే ♦ యింపైన కార్యంబు; త
ద్విపరీతంబగు నేనిఁ గావుము కృపా ♦ సింధూ! మూఢునిన్ గోపికా
చపలాక్షీ ప్రియ! దేవకీ తనయ! కృ ♦ ష్ణా! దీనమందారమా. 83

శా. దీనాలాపము లాలకించుచుఁ గృతా ♦ ర్థీభూతచేతస్కులౌ
మానీంద్రుల్ భవదీయ సత్కథలు స ♦ న్మానించి మోదమ్ముతో
గానమ్ముల్ పచరింపఁగాఁ గరము ర ♦ మ్యంబైన నీమూర్తి నే
నానందంబునఁ గొల్చుచుండెదను కృ ♦ ష్ణా దీనమందారమా. 84

మ. అసమానంబగు నీప్రభావమున బ్ర ♦ హ్మాండంబు నీయిచ్ఛకున్
వసమై యుండఁగఁ గాచు మేటివనఘా ♦ బాలుండవై వట్టి మా
నిసి వోలెందగ గోపబాలకులతో ♦ నేస్తంబుఁ గావించుచుం
బసులం గాచుట యబ్బురంబుగద కృ ♦ ష్ణా! దీనమందారమా. 85

మ. జగతింగష్టదశల్ ఘటిల్లినఁ దిర ♦ స్కారంబుఁ గావింపఁగాఁ
దగు సామర్థ్య మొసంగుఁ శాపవితతేన్ ♦ దావాగ్ని ఘోరాటవిం
దగులం బెట్టుడు మాడ్కి నాశమునుఁ బొం ♦ దం జేయు సద్భక్తి నే
యుఁగ లేనట్టివి యేపనుల్ గలవు కృ ♦ ష్ణా! దీనమందారమా. 86

శా. మందుల్గొందఱు జీవితంబులతి దు ♦ ర్మాలిన్య యుక్తక్రియా
సందోహంబులఁ బాడుచేసికొని యీ ♦ షద్భక్తి రాజిల్ల నీ
యందున్నిల్పక యుందు "తొందరది యే ♦ లా వృద్ధులై నామొ" యం
చుం దాఱన్ బ్రదుకొక్క నిశ్చయమొకో? కృ ♦ ష్ణా దీనమందారమా. 87

మ. అమరేంద్రాదుల కైనఁ గాని భవదీ ♦ యంబైన భూరిప్రభా
వము వీక్షింపఁగ దుర్లభంబగును నీ ♦ భక్తాళి కెల్లప్డు ని
క్కము నీవే సులభుండవౌదువు రమా ♦ కాంతా యనిత్యం నమో
నమ' యంచున్నను నేస్మరించెదను కృ ♦ ష్ణా! దీనమందారమా. 88

మ. త్రిజగన్మాన్య పదారవిందయుగ! నీ ♦ దివ్యద్దయా దృష్టినా
వృజినంబుల్దొలగింపవే మనమునం ♦ దేవేళల న్నీ పదాం
బుజముల్నమ్మి భజింతునయ్య కరుణాం ♦ భోరాశి! నన్ గావుమ
న్నజనుల్గాచుటసేరు భారమొకొ! కృ ♦ ష్ణా! దీనమందారమా. 89

మ. జగతిన్ దానము లెన్ని చేసినను య ♦ జ్ఞ వ్రాతముం జేసినన్
సుగుణ భ్రాజదుదార కీర్తియుతులై ♦ శోభిల్లి నన్నియెడం
దగసద్భక్తి విహీనులైన యెడలన్ ♦ ధాత్రీజనాళుల్ నికృ
ష్టగతిం జెందక యుండనోపుదురె? కృ ♦ ష్ణా! దీనమందారమా. 90

శా. దాసుల్ చేసిన తప్పులన్నియు నొకే ♦ దండంబుతోఁ జెల్లఁగా
దే సర్వేశ! భవత్పదాంబుజ యుగం ♦ బే నమ్మినానయ్య నా
దోసంబుల్ సహియించి నాదుమదిలో ♦ దుర్భావముల్ మాన్పవ
య్యా సర్వజ్ఞ! భవత్కృపామహిమఁ గృ ♦ ష్ణా దీనమందారమా.

శా. ఎందే నిన్ను స్మరించువారి ననఘా ♦ యిద్ధాత్రిలో దుఃఖముల్
పొందన్నేరవు వీతిహోత్రుఁ జలిగా ♦ ద్పుల్ సేర లేనట్టు లా
నందం బొప్పఁగ సౌఖ్యముల్గలుగుఁ జిం ♦ తాశల్యముల్ వాయు నెం
దైనన్ వారికి లోపముల్ గలవె? కృ ♦ ష్ణా! దీనమందారమా.92

మ. ధనధాన్యాది సమృద్ధి గల్గుటకు నీ ♦ దాక్షిణ్యమే కారణం
బనఘా నీదుకృపామహత్త్వమునఁ గా ♦ దా సౌఖ్యవారాశిలో
జను లిద్ధారుణి నోలలాడి పిదపన్ ♦ స్వర్గోరు సౌఖ్యంబులం
గనఁగాఁ జాలుదురయ్య నందసుత! కృ ♦ ష్ణా! దీనమందారమా. 93

మ. ముదమారన్ నినుఁ బూజసేయని కరం ♦ బుల్ నీచరిత్రంబులం
జదువన్నేరని జిహ్వ, భక్తిమెయి నిన్ ♦ జింతింపకేయున్న యా
హృదయంబుం, దగనీకు మ్రొక్కనిశిరం ♦ బిద్ధాత్రిలో వ్యర్థముల్
యదువంశాంబుధిసోమ! లోకనుత! కృ ♦ ష్ణా! దీనమందారమా.94

మ. ధరలో నీదు పవిత్రనామమును నే • ధన్యుండ సద్భక్తితో
నిరతంబుం భజియించుచుండు నిను హృ • న్నీరేజమం దుంచి; త
ద్దురితవ్యాళహలాహలం బడఁగదే • తోడ్తోన నీదైన యా
చరణాబ్జ స్మరణామృతంబునను కృ • ష్ణా! దీనమందారమా. 95

శా. ఏమో వేడితి నంచు నెంచకుము నీ • వే దిక్కు నా కీధరి
త్రీ మధ్యంబున లేరి కెవ్వరు; కృపా • బ్ధీ! నీదు పాదాబ్జముల్
సామోదంబుగఁ గొల్చుటొక్కటియె ని • త్యంబుం హృదబ్జంబునన్
గామింతుం ననుపేక్షఁ జూడకుము కృ • ష్ణా దీనమందారమా.96

శా. నీపాదామలధూళి పాపచయముం • భేదించి యిద్ధాత్రిలో
నాపాదించును పావనత్వమతి భా • గ్యా యత్తమై సంగదా
నీపాదాంబుజ సేవయందున నొకిం • తే బుద్ధి వ్యాపించుటల్
చాపల్యంబును జెందకుండుటయుఁ గృ • ష్ణా దీనమందారమా.97

మ. అల యక్రూరుఁడుఁ గాను; దంతియునుఁ గా • నయ్యర్జునాఖ్యుండఁగా
నలఘుప్రాభవుఁ డాకుచేలుఁడను గా • నయ్యా! ధరం నీకు వా
రలు దాసుల్ తగ వారి దాసుఁడను, నన్ • రక్షించు వైకుంఠ! ని
చ్చలు నీనామము సంస్మరించెదను కృ • ష్ణా! దీనమందారమా.98

మ. ప్రమదంబారఁగ నెన్ని మార్గములచే • వర్ణించినంగాని స
ర్వ మతంబుల్ పరమాత్ము నొక్కరునె ని • ర్వ్యాజంబుగాఁ జెప్పవే?
కుమతుల్ రోసమునం స్వకీయమతముం • గొండాడుచుం సర్వదో
షము లన్యమ్ముల పైనఁ బెట్టెదరు కృ • ష్ణా! దీనమందారమా. 99

మ. అనఘా! భక్తజనాళి కల్పకమ! ని • త్య[illegible]విరాజద్దయా
వనసంరక్షిత దాసమానస శుక • వ్రాతా! లసచ్చక్ర లాం
ఛన! దుష్కార్యకలాపహంసగణఝుం • ఝామారుతంబా! సదా
నను నీదాసుని గావ వేడెదను కృ • ష్ణా! దీనమందారమా.100

మ. పుడమిం జింతలపాటివంశ కలశాం♦భోరాశికిం జంద్రుఁ డై
వ్వాఁడు, డెప్ప్యూటికలెక్టరై తనరె నే♦ ప్రాజ్ఞుండు, నేకీర్తిసాం
ద్రుఁడు లోకాంతరమేగుచో జనుల క♦న్నుల్ గాల్వలై కాల్చెఁ, బు
త్రుఁడనాధీరునకున్ శివాఖ్యునకుఁ; బే♦రోదక్షిణామూర్తి; యిం
పడరం బద్యశతంబుఁ గైకొనుము కృ♦ష్ణాదీనమందారమా.101





పరబ్రహ్మణే నమః






# శ్రీ భక్తపాలనశతకము

ఇయ్యది

జగన్నాథ కృష్ణానందకవులచే రచియింపఁబడి

ప్రకటింపఁబడియె.



మొదటికూర్పు, 1000 ప్రతులు.



రాజమహేంద్రవరము

శ్రీవిద్యానిలయ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1913



వెల రు 0—2—0 లు